౨౦౨

# శ్రీ
# చన్నమల్లేశ్వర శతకము.



ఇయ్యది

శివభక్తులకు నత్యంతోపయోగమగునటుల

గంగాధర కవివర్యునిచే రచియింపఁబడి

ఏ. రామారావుగారిచే పరిష్కరింపబడి

జూలూరి శ్రీరాములుగారిచే ప్రకటింపబడినది.

రామా ముద్రాక్షరశాల ఏలూరు.

1924

శుభమస్తు.

శ్రీసాంబశివాయనమః.

# * పున్నాగరాగం-అటతాళము. *

ఏలాగువలచితివీ యీడంగమయ్యాను నేమమ్మ
భ్రమరాంబికా॥ బాలారోసిబుద్ధి బంగారమాయెతేను -
వాలాయముగయీబిచ్చగానినీవు॥ ఏలా॥ నేలాటివాడే
గోచిపైనలేదాట - యెద్దెక్కి దిరుగూనటే - కాలాసర్ప
ములతోనుగలసిమెలసునాట - గరళాము తిన్నాడటే -
పాలుపొందు పులితోలుగప్పుకు ప్రేతభూముల దిరుగు
నటే - చాలాగాభూతపిశాచగణములతోటి - సహవా
సమేకాదటే - జోలిగప్పరచంకబెట్టుకు జోగివలెదేశ
ములందిరుగుచు - మాలకన్నడిచేత యెంగిలి మాంసమే
భక్షించినాడట॥ ఏలా॥ గుట్టుగుణములేని కుక్షింభ
రుండట కులగోత్రములులేవటే - పుట్టుదారిద్రుడై బూతి

భూసుకు బుట్టలోనే తినునటే॥ గే॥లా॥ పిట్టవ్వగారింట పిట్టంతాతని పెట్టి - తట్టా మోసెనటే - ఘట్టిగాజాలారి కన్యనుపట్టి తీసుకవచ్చి తలపై బెట్టుకొనిగే - అదితనకు లోపల చుట్టమని తామిట్టిపడునటే॥ గే॥లా॥ ధారుణిలో నొక్క తపసిచేతను మూడు తన్నూలుబడ్డాడటే - పా ఱుబోతట వెఱ్ఱిబాగులాడట బహుతామసపువాడటే - కోరిఅడపమందుకొని మూడసంబికి కుంటుననడచెనటే॥ గేలా॥ మూగమపలుచువచ్చి శ్రీగిరిమందిగుడు చామర్తి లక్ష్మీనారసింహుని హృదయమందున నాటుకొని యెడ బాయలేడట॥ గేలాగువలచితివి యీజంగమయ్యను నామమ్మ భ్రమరాంబికా॥

# చన్నమల్లేశ్వర శతకము.



## * సీసపద్యములు. *

శ్రీమన్మహాదేవ సృష్టిసంరక్షణ దక్షాధ్వరధ్వం
సధవళవర్ణ । నందివాహనయూళ నాగేంద్రమాయూర
కందర్పసంహరకలుషదూర । కైలాసగిరినాథ కనకాద్రికో
దండ కారుణ్యనిధి భక్తకల్పవృక్ష - గంధర్వగీర్వాణగరు
డకిన్నరయక్ష సిద్ధవిద్యాధర సేవితాత్మ - పార్వతీప్రాణ
నాయక భవ్యచరిత - భర్గలయకాలరుద్ర కృపాసము
ద్ర - సర్వగుణధామ శ్రీశైలసార్వభౌమ - చన్నమల్లేశ
శివలింగ శరణు శరణు॥ ౧॥ కడునొప్పు వేదముల్ ఘన
తురంగంబులు వసుమతీచక్రంబు వరరథంబు - వేయి
మోములవాడు వేయాధిపుడునారి కొమరొప్పు బంగారు
కొండయిల్లు - ధీరత్వమున బ్రహ్మదేవుండు సారథియం

బుజాత్ముడు దివ్యమైనశరము - యేకమై దేవతానీకంబు
భృత్యులు భానుండు చంద్రుండు బండికళ్ళు - అట్లుగా
వించి లోకవిఖ్యాతముగను - త్రిపురములు ద్రుంచి మిం
చినదివ్యమూర్తి - సర్వగుణధామ శ్రీశైలసార్వభౌమ॥ ౨॥
కాశీస్థలంబున కారుణ్యమూర్తివై శిష్యవర్గములరక్షిం
చిమించి - జగతిలో ప్రత్యక్షశంభుడై విలసిల్లి - విభూ
తిపురమందు వినుతికెక్కి - అంగ వంగ కళింగ బంగాళ
నేపాళ - కర్నాటభూముల ఘనతకెక్కి - సృష్టిలో శ్రీ
శైల సింహాసనంబున మల్లికార్జునలింగ మైనమూర్తి -
భక్తమందార శ్రీగురుబసవదేవ - సద్గురుస్వామినిను నే
సన్నుతింతు॥ సర్వ॥ ౩॥ శ్రీవినాయకునాత్మ సేవించి భా
వించి బహువిధంబులగౌరి బ్రస్తుతించి - భద్రకాళీపతి
ప్రాణనాయకుడైన - వీరభద్రేశ్వరు వినుతిజేసి - విలు
విద్యదీక్షాప్రవీణుడై విలసిల్లు - తారకాసురవైరి తలచి
తలచి - కరుణాసముద్రుడై కాశిలో నెలకొన్న కాలభైర
వుపాదుకలకు మ్రొక్కి - మరియుభృంగీశ్వరుని దివ్యమ

హిమశైల్ల - పెక్కువిధముల బ్రణుతింతు ప్రియముతోడ॥
సర్వ॥ ౪॥ కమలాప్తకోటిప్రకాశమై జగములు వెలుగు
చునుండు నీవెండికొండ - మునికోట్లకునుముక్తి మూల
మైనసారమై విఖ్యాతినెక్కె నీవెండికొండ-విరించాదులకా
ధారమై నిత్యవిభవంబులిచ్చు నీవెండికొండ - జంభారి
మొదలగున సకలదేవతలకు వినుతింప దరమె నీవెండి
కొండ - వెలయ బ్రహ్మాండమైన నీవెండికొండ - వేల్పు
లకు నెల్ల గండిసీ వెండికొండ॥ సర్వ॥ ౫॥ కలహంస
కలకంఠ గండభేరుండాది పక్షులకిగువు నీ పర్వతంబు-
సింహశార్దూలాది జీవరాసులకెల్ల ప్రాణసంరక్షణ నీ
పర్వతంబు - ఘనరత్నములచేత కల్ప వృక్షములచే
ఫలితమైయొప్ప నీపర్వతంబు- మణిమంత్రసిద్ధులు మఱు
మాయతపసులు- పరగరక్షించు నీపర్వతంబు- గరుడగం
ధర్వయక్ష కిన్నరకులాధిపతుల కెల్లనుతండ్రి నీపర్వతంబు॥
సర్వ॥ ౬॥ బసవన్నపాదముల్ భక్తితో పూజించి పండి
తారాధ్యుల బ్రస్తుతించి-శివనాగమయ్యను ప్రసిద్ధిగాఁగొ

నిరూఢి మడివాలుమాచయ్యమణికి మ్రొక్కి - కిన్నరబ్ర
హ్మయ్య కీర్తించి కీర్తించి - భల్లాణరాయుని భజన
జేసి - కుమ్మరగుండయ్య కోరిప్రార్థించియు చిరితొం
డ భక్తుని సేవలంది - ప్రమథవర్గంబుల శ్రీపాదపద్మ
ములకు - శరణు శరణార్థియని మ్రొక్కి నన్నుతింతు॥
సర్వ। ౭॥ నీపట్టణపు దేవి నిఖిలలోకములకు ఆధారమ
య్యె జీవాత్మలకును - నీకూర్మిపుత్రుండు నిఖిలవిద్యలకెల్ల
సన్నుతస్వామియై సంభవించె - నీజటాజూటంబు నెలకొ
న్నచంద్రుండు పరిపూర్ణకళలచే ప్రసిద్ధికెక్కె - నీలలా
టంబున నివసించియుండిన వైశ్వానరుడు లోక వంద్యుడ
య్యె - నీప్రభావంబులెన్న నేనెంతవాడ-అప్రమేయుండ
వాద్యుండవయ్య నీవు। సర్వ॥ ౮॥ హరిసుర బ్రహ్మాదులష్ట
దిక్పాలకుల్ మిమ్ముబూజలుచేసి మెరసిరయ్య - అన
సూత్రుడే దైవ మంచును మిముగొల్చి ముని సమూహం
బులు ముఖ్యులైరి-నీలకంఠుడుమాకు నిష్ఠవేల్పని మిమ్ము
జెందిరినవనాటసిద్ధులెల్ల - తుంబురునారదాదులుమిమ్ము

గొనియాడి యానందభరితులై యఖిలదిశల - మరియు బ్రహ్మాండకోట్లు సీమాయలోన - జన్మసాఫల్యము క్షితి చెలగుచుండు॥ సర్వ॥ ౯॥ విశ్వలోకేశ్వర వినుసీవుమా తండ్రి కాత్యాయనీదేవి కన్నతల్లి - పన్నగాభరణమీ భక్తులే బాంధవుల్ పంచాక్షరీమంత్ర పఠనచేత - యూధికె క్కినయట్టి రుద్రాక్షమాలికల్ ఘనమైన రత్నాలకంఠ మాల - పార్వతీరమణమీ భసితత్రిపుండ్రంబు త్రిభువ నంబులయందు దేజరిల్లు - యింక మీ వాంఛనంబులు యెన్నదరమె - వేయిమోముల ఫణిలోక విభునికైన॥ సర్వ॥ ౧౦॥ ఏ దేవుపూజించి యిందాదిసురులెల్ల స్వర్గా దిలోకప్రశస్తులైరి - యే దేవుపూజించి యిందిరారమ ణుండు కలయలోకంబుల కర్తయయ్యె - యే దేవుపూ జించి యిక్ష్వాకుకులులైన చక్రవర్తులుమోక్ష సరవిగ నిరి - యే దేవుపూజించి హిమవంతుడధికుడై పర్వతం బులకెల్ల కర్తయయ్యె - అట్టి దేవాది దేవుండ వైన మిమ్ము యభయహస్తంబు వేడెదయాదరించు॥సర్వ॥౧౧॥

శ్రీగిరిభ్రమరకాశి విశ్వపతిరాణి యన్నపూర్ణవిశాలాక్షి
గొలచి - కాంతాశిరోమణి కంచికామాక్షమ్మ కమలా
క్షి బెజవాడకనకదుర్గ - కాళహస్తీశ్వర కామినిరత్నంబు
నను గన్న తల్లి యానందవల్లి-త్రిపురాంతకంబున దేజ
రిల్లుచునున్న పార్వతీదేవమ్మ పద్మనేత్రి- కాళికా శక్తిదల
చిలోకంబులోన- నిమహాత్వమువర్ణింతునిర్మలాత్మ॥ సర్వ॥
పరమేశమీపాద పంకజంబులమీద స్థిరమైనబుద్ధి దయ
సాయవయ్య - నిటలాక్షనీకథాసీకంబులాలించ సుజ్ఞా
నిగా దయజూడవయ్య - ప్రమథానాథ మీ భక్తులస
ద్గోష్ఠి మన్నించికృపతోటిమనుపవయ్య- నగరాజనిలయ
దీనత్వంబుదొలగించి చేపట్టినన్ను రక్షించవయ్య- యీ
శమీపాదమేకాని యితరమెరుగ - యెన్నివిధములనైన
నన్నేలవయ్య॥ సర్వ॥ ౧౩॥ శాంభవీరమణ నాజన్మపా
వనమయ్యె పంచాక్షరీమంత్రపఠనచేత- భావనాతీత నా
భవరోగములుబోయె పొలుపొంద మీ యనుగ్రహము
చేత - పాపబంధంబులెల్లను బాసిపోయె - యింకయము

కింకరులకును నేనువెరువ॥ సర్వ॥౧౮॥ వేయుగన్నులుగల విబుధలోకేశుండు ఘనమైనమీమాయ గానలేడు - సృష్టిపుట్టించు రాజీవసంభవుడైన కరమొప్పమీమాయగానలేడు - గౌతమకణ్వమార్కండేయుసన్మౌని గణములు మీమాయగానలేరు - భువనంబులన్నియుఁ బోషింపజాలిన నరహరిమీమాయ గానలేడు - మానవులకెల్ల నరమె మీమాయదెలియ - నప్రమేయుండనాన్యుఁడవయ్య నీవు॥ సర్వ॥౧౯॥ నిఖిలలోకాధీశ నీవాహనంబైన వృషభేంద్రునకు మహావిభవమస్తు - మీనధ్వజారాతి మీకులాంగనయైన యద్రినందనకు కళ్యాణమస్తు - శశికళామాళి నీజడలలో నెలకొన్న జాహ్నవీనదికినైశ్వర్యమస్తు - బ్రహ్మాండనాథ నీభక్తసంఘంబైన ప్రమథాదులకుమహాభద్రమస్తు - వీరభద్రేశ్వరునకునువిజయమస్తు - యనుచునర్థింపుచున్నాడ యాదిదేవ॥ సర్వ॥ ౨౦॥ విశ్వప్రపంచంబు వెలయంగనిర్మించి జీవరాసులను రక్షింపగలచి - లోకంబులెల్ల నీకుక్షిలోపలనుంచి లీలావినోదంబు లెల్ల

జూపె - పక్కరూపములను పెంపెక్కసొంపెక్క తెలి పయనుద్దండత తరిపిలేక - జోతిప్రకాశమై శోభిల్లునీమూ ర్తి చెప్పజూడంగ సచ్చెనవుగాద - మేనవంకను త్రి ణామంపు మెరసియుండు - అయ్యనివాదిమూర్తివి యఖి లములకు॥ సర్వ॥ ౧౭॥ శంభుండు సత్యప్రారంభుండుభో గుసాశ సర్వ బ్రాండములకు జనకుడితడు - సర్వుండు కరు ణాసముద్రుండు శ్రీవీరభద్రావతారుడై ప్రబలినాడు - శంకరుండద్రిభయంకరవినుతుండు పంకజరిపుమాళిభ వ్యమూర్తి - ఈశ్వరుండఖిలలోకేశ్వరుండధికుండు శా శ్వతుండఖిలాండచక్రవర్తి - అనుచు కొనియాడుచుమరు మిమ్ము నఖిలదిశల - దేవగంధర్వములు లెల్లదినదినంబు॥ సర్వ॥౧౮॥ కైలాసనాధమీకళ్యాణగుణములు పొగడుచు చప్పన్నభూములందు - ఫాలలోచన వీరభద్రునివిజయ ముల్ వెలయుంతునయ్య భూవలయమందు - గీర్వాణ వినుత మీకీర్తిప్రభావంబు దిగ్దేశములబ్రస్తుతింతునయ్య జగదేకవంద్య మీ శౌర్యప్రభావములెల్ల నెరిగింతుభూ

మండలముల - వెలయ మీపాదసేవ కావ్యర్తి జేసి - ప్ర
మథులకు నెల్ల నిత్యంబు బ్రస్తుతింతు॥ సర్వ॥ ౧౯॥ శ్రీశైల
నాథ రాజరాజ సన్నుత ప్రాలేయగిరిజా ప్రాణనాథ - జ
లజాసనస్తోత్ర చంద్రార్కశిఖినేత్ర సూత్రామసంతతస్తో
త్రపాత్ర - నీలకంధర యీశ నిటలాక్షసర్వేశ వాసుకీవ
లయ కైలాసనిలయ - నిఖిలలోకాధార సద్భక్త మందార
రభావజసంహార భవవిదూర - తార కర్పూరహార మందార
విహార - తారకాధీశ చందనధవళవర్ణ॥ సర్వ॥ ౨౦॥
కాశీస్థలంబున నాదంబువీడ్కొన్న కైలాసపదవులు గలు
గునండ్రు - శ్రీశైలశిఖరంబు చెలువొంగ గనుగొన్న కై
లాసపదవులు గలుగునండ్రు - పత్రిపుష్పముల మిమ్ము
భక్తిపూజించిన కైలాసపదవులు గలుగునండ్రు - మృ
డుడె దైవంబని మీసేవ జేసిన కైలాసపదవులు గలుగు
నండ్రు - గానతలపోసి మీపదధ్యానమునను - విశ్వపతి
వైన మిమ్ము నేవినుతి సేతు॥ సర్వ॥ ౨౧॥ వసుమతిస్థలమం
దు వారధులందును తరువులయందు భూవరములందు -

నక్షత్రములయందు నాకలోకములందు ఖగములయందు గోగణములందు - మృగసంఘములయందు నిగమార్థ ములయందు శిలలందు హేమాద్రిశిఖరమందు - కల్ప వృక్షమునందు కమలంబులందును కైరవంబులయందు కనకమందు - దివ్యవేళలయందు విమాతిక దేజరిల్లు - ఘనత కెక్కిన గంగోదకములయందు॥సర్వ॥—౧౨॥ చెంచు రూపములు ప్రసిద్ధిగా గైకొని ప్రమథాధిపులనెల్ల భటుల జేసి - సారమేయంబులై చదువులుగొల్వగా పారుటా కులుచుట్టువారిమెరయ - ఆ యింద్రకీలాద్రి యతివేగమున నెక్కి క్రోడంబునుర్విపై గూలనేసి - కోరివచ్చినసునా సీరునందనుమెచ్చి కోరినవరమిచ్చి కృపదలంచి - దివ్య బాణంబుకృప జేసి ధీరగతిని- వేలనీవెంట విభవంబువిను తి జేతు॥సర్వ॥—౧౩॥ శ్రీకంఠుచింతించు చిత్తంబు చిత్తంబు శివభక్తులతో జేయు చెలిమిచెలిమి - జంగమార్చన జేయు సౌఖ్యంబు సౌఖ్యంబు పరమేశు జేరెడు బ్రతుకు బ్రతుకు- కరకంఠుపూజించు కరములుకరములు శంకరుగొనియా

డుచదువుచదువు - గంగాధరునిజూచు కన్నులుకన్నులు పార్వతీశ్వరుపాదభక్తిభక్తి - - యనుచు శృతులెల్ల లో కవిఖ్యాతముగను - పలుకుచున్నవిసతతంబు బహువిధ ములసర్వ॥౨౮॥ త్రిజగంబులెరుగంగ రజితాద్రిపైనుండి కంచికివేంచేసి ఘనతమెరసి - వృద్ధజంగమరూపు వెల యంగ గైకొని చిరితొండవిభునివీక్షించియతని-కొడుకుని కూరగానడిగినం తటిలోన శిరియాలురక్షింప శీఘ్రము నను - ప్రమధవర్గములతో ప్రత్యక్షమైమెచ్చి కంచే డువాడలు కరుణతోడ - వరవిమానంబులెక్కించి వైభ వమున-వెండికొండకుతోడ్కొని వెలసితయ్య॥సర్వ-౨౯॥ కైలాసమునసుండి ఘనవైభవంబున భళ్ళాణరాయునిభ క్తిజూడ - సింధుకటకమునకు శీఘ్రమేగ నెంచి మిం డజంగమరూపు మెరయదాల్చి - పొలతికి నొక్కొక్క పురుషునిగల్పించి యామహారాజేంద్రు నప్పుడు గాంచి - భూపాలునాకుయిప్పుడువేశ్యడమ్మన్నయిల్లాలునాకిజూ యిచ్చినపుడె - పణతిహస్తంబులో కూర్మి పట్టివగుచు -

జనపతికిమోక్షమొసగిన సదయ హృదయ॥ సర్వ॥ ౨౬॥
ధరలోన పుణ్యతీర్థములకు నెక్కువై వాసికినెక్కునీవార
ణాసి - గంగావిశాలాక్షి కాలభైరవులకు వరనివాసంబు
నీవారణాసి - మానవశ్రేణికి మారటకైలాస - వైభ
వోన్నతము నీవారణాసి - సాక్షివినాయక స్వామికియా
నందవార్ధిఁ దేలించు నీవారణాసి - బిందుమాధవభార
తీంద్రియముల కంద - వజ్రవైడూర్య పతకంబు వార
ణాసి॥ సర్వ ౨౭॥ దేవేంద్రవిభవంబు దినకర తేజంబు
యభవనీభక్తుల యందు గలదు - కందర్పరూపంబుఘన
భుజాటోపంబు యభవ మీా భక్తుల యందు గలదు -
కనకాద్రిధైర్యంబుగాదిలిశౌర్యంబు - యభవ నీభక్తుల
యందుగలదు- నిరుపమజ్ఞానంబు మీాపద ధ్యానంబు -
యభవ నీభక్తుల యందుగలదు - యరసి చూడంగ
భువనత్రయంబులోన-యెంచమీాభక్తవరులకుయెదురులే
దు॥సర్వ॥నీయాజ్ఞచేగాదె నీరజమిత్రుండు విశ్వలోకంబుల
వెలగుచుండు-నీయాజ్ఞచేగాదెనిర్మలకాంతితో రోహిణీనా

ధుంధుమారునకెక్కె - నీయాజ్ఞచేగాదె నిఖిలనైభవముల
గీర్వాణనాథునకు కీర్తికెక్కె - నీయాజ్ఞచేగాదెనిష్కళం
కాత్ముండుపవనుండు సత్యసంపన్నుడగుట - యగ్నిదే
వుండుశుమవసుగాదులెల్ల-నీమహాత్త్వంబువలన రాణించు
వారు॥సర్వ॥ ౨౯॥ రాజీవములుభాస్కరురాకగోరినయట్లు
కువలయంబులుచంద్రుగోరినట్లు - హంసలు కొలనుల
కాపేక్షబడునట్లు చిలుకలుఫలము కాసించినట్లు - తేర
గొప్పపూదేనెతేటిగోరినయట్లు కోకిలంబులువనముగోరి
నట్లు - నలినాక్షితనప్రాణనాథుగోరినయట్లు గోవులు
పశిరికగోరినట్లు - పార్వతీనాథమీపాదపద్మసేవ - కోరి
నాచిత్తమున్నది కృపనుజూడు॥సర్వ॥౩౦॥ సత్యసంధుడు
హరిశ్చంద్రభూపాలుండులీలతో భూచక్రమేలుచుండు -
దేవేంద్రుడొకనాడు యావశిష్టాదులు ప్రశ్నగావించిన
పంతమునను - వినికౌశికుడు కోపమున వసిష్ఠునితోడ
తర్కించిశివుగాంచిదానమడిగి - మాయలుపన్నినమరి
మరవస్థచే పణతిగోల్పడివీరబాహుజేరి - వున్నయారాజు

మెచ్చి ప్రసన్నుడగుచు - చెలగిపట్టాభిషేకంబుచేసినావు
సర్వ॥౩౧॥ కుమ్మరగుండయ్యగుణములుపొగడంగ యుత
రాజునకునైన నలవియగునె - మడివాలుమాచయ్యమ
హిమలువర్ణింప యంబుజాసనుకైన నలవిగాదు - కులకే
తబ్రహ్మయ్యఘనతవర్ణింపంగ యలబృహస్పతికైన నలవి
గాదు - శిరియాలుశేఖరుశివభక్తి వినుపింప యమరుల
కెల్లనునలవిగాదు - సాంఖ్యతొండయ్యభక్తి విశ్వాస
మహిమ- పొదిలనిమ్మవ్వగుణములుపొగడదరమె॥ సర్వ॥
౩౨॥ సాహసంబునఘోరసంగ్రామభూమిలో సామజా
సురుబట్టి సంహరించి - యధికరౌద్రంబునయంధకాసు
రుద్రుంచియమరులకెల్లను నభయమొసగి - వ్యాఘ్రాసు
రునిబట్టి శీఘ్రమేవధియించి వానిచర్మంబునువలువజేసి -
మిగులగర్వించిన మృత్యువక్త్రంబు దా కాలదన్నికీల
నణచిమించి - యల్లలోకంబులెల్లనువెల్లివెలయ॥ సర్వ
గుణధామ॥ ౩౩॥ నీవంటిదైవంబునినుబోల వేల్పులెవరో
లోకమునలేరుయెంచిచూడ - నీవంటికారుణ్యనిధిభక్త

సులభుండు - నేలోకమున లేరుయెంచిచూడ - నీవంటి ఘనపుణ్యనిపుణుండునిలయుండు నేలోకమున లేరుయెం చిచూడ - నీవంటిసర్వజ్ఞనిర్వాణభర్తయు నేలోకమున లేరుయెంచిచూడ - నీవెబ్రహ్మాండ వేల్పువునిర్ణయింప- సర్వగుణధామ॥ ౩౮॥ శ్రీరాద్రిశయనునిసృష్టికర్తనుజేసి కమలసంభవులేఖకరునిజేసి జంభాసురారిని స్వర్గాధిపతి జేసి యగ్నిదేవునిమహాప్రాజ్ఞ జేసి ధర్మరాజునుశిక్షధారు నిగాజేసి రా - త్రించరునియశ్వకాతుజేసి - వరుణుని సాగరవల్లభుగాజేసి పవనునిసత్యసంపన్నుజేసి - దీవితో యకునిసంగడిగాజేసి - వెలయనీశానుఘనము గావించి తయ్య॥ సర్వ॥ ౩౯॥ గోరాజగమననీగుణము లెన్నినచో టసకలరత్నంబులుసాటిరావు - కల్యాణమూర్తి నీకరుణ యెన్నినచోట జలనిధులెన్నైనసాటిరావు - ధవళాంగ మీమహాధైర్యమెన్నినచోట శైలంబులెన్నైన సాటి రావు - రజితాద్రినిలయమీరౌద్రమెన్నినచోట సకల బ్రహ్మాండముల్ సాటిగావు - యింకమీశౌర్యగుణము

లుయెన్నఁగరమె - షణ్ముఖసంభవగీర్వాణపతులకైన॥సర్వ॥
౩౬॥ గంగాధరుఁడుమాకుముంగొంగురత్నంబు గౌరీశ్వ
రుఁడుమాకుకల్పతరువు - నీలకంఠుఁడు మాకు నెనరైన
చుట్టంబుగజచర్మధరుఁడు మమ్మేలు వేల్పు - ఫాలలోచ
నుఁడు మాపాలిటిదైవంబు పరమేశ్వరుఁడుమాకుఁబ్రాపు
దాపు - మృత్యుంజయుఁడుమాకు మేరువశిఖరంబు గరళ
కంఠుఁడుమాకు ప్రాణవిభుఁడు - ఘనుఁడుకైలాసపతి
మమ్ముఁగన్నతండ్రియనుచు గొనియాడుచున్నాఁడ నభవ
మిమ్ము॥ సర్వ॥ ౩౭॥ మడివాలుమాచయ్య మాదిరాజ
య్యను శివనాగమయ్యను జేరికొల్తు - కిన్నరబ్రహ్మయ్య
కేశిరాజయ్యను సిద్ధరామయ్యను చేరికొల్తు - బన్నిగుం
డాబిబ్బ బాచయ్యగారిని సిరియాలువల్లభు జేరికొల్తు -
శంఖరదాసయ్య సాంఖ్యతొండయ్యను చిరితొండభక్తుని
జేరికొల్తు - మఱియుచవుడయ్యగారిని సోమవిభుని -
సింధుభల్లాణరాయుని జేరికొల్తు॥ సర్వ॥ ౩౮॥ శ్రీమంతు
లై సుఖస్థితిని నుండెటివారు పరిపూర్ణకళలచే బరగు

వారు - గోమేధికములు గైకొనిధరించినవారు విద్యా ప్రవీణులై వెలయువారు - గంభీరమూర్తులై ఘనతకెక్కినవారు ఘనపుణ్యమూర్తులై గాంచువారు - యానందవార్ధిలో నాడుచుండెడివారు పుత్రపౌత్రులవృద్ధిబొందువారు - పూర్వమునమిమ్ము బంగారుపుష్పములను - పూజగావించిధాత్రిలో పుణ్యులైరి॥ సర్వ॥ ౩౯॥ భావింపమీపాదపద్మసంసేవయు సేయంగగలిగె యీజన్మమునను - నాపుణ్యవశమున నానావిధంబుల నీపద్యశతకంబుసేయగలిగె - మదిదీరమానవ లోకంబునందును కోర్కెలీడేరమిముగొల్వగలిగె - నాభాగ్యమహిమచేమీభక్తవరులతో ప్రియగోష్ఠినుండంగ పెంపుగలిగె - యింకసంశయమేది నాకేలచింత - కంటికైవల్యపదవి మీకరుణచేత ॥ సర్వ ॥ ౪౧ ॥ ఏవేళమీపాదసేవచేసిన వారు కైవల్యసామ్రాజ్యంబు గన్నవారు-ఏవేళమీపాదసేవ జేసినవారు దైశ్వర్యసంపన్నులయినవారు - ఏవేళ మీపాదసేవజేసినవారు పట్టాభిషిక్తులై బరగువారు -

గా వేళమిాపాదసేవ జేసినవారుభూచక్రమందుబెంపొందు
వారు - వసుధయావేళమిము గొల్చునారికెల్ల - యెనుగు
గావచ్చుకై వల్యపదవులందు సర్వ॥ ౨౧॥ మూర్ధ్వ
ముఖంబుగానూ వాలుకలపోసి గగనంబుచూచిన గాన
రావు - పకన యోగంబెల్ల పాటించిచూచిన కన్నులకిం
పైనగాన రావు - చనువులలోన మిాజాడగనియెదమంటె
గప్పినమాయచేగానరావు - జపతపంబులచేత జాడగని
యెదనంటె చేజిక్కవెంపైనగాన రావు - యింకనిమూ
ర్తిగానగ నేదిబుద్ధి - చింతలేకుండ జేసి రక్షించవయ్య॥
౨౨॥ కలధౌతగిరియందుకనకాద్రియందును హిమవంత
మందు హేమాద్రియందు - రజతాచలమునందువింధ్య
పర్వతమందు - సంజీవనీముఖ్యశైలమందు - మాల్య
వంతమునందు మందరాచలమందు - వలకొప్పుపూర్వ
పర్వతమునందు-యతులితంబుగ త్రికూటాద్రియందు -
చక్రవాళాద్రియందు ప్రశస్థముగను - తేజమైయున్నమిా
దివ్యమూర్తి మహిమ॥ సర్వ॥ ౨౩॥ లీలతోయనబదివాల్గు

లక్షలజీవ రాసియోనులబుట్టి చెలగుచుండు - కర్మజీవుఁ
డనై ఘనదుష్కృతంబుల బొరలుచుబహుచింతబొంది
బొంది - యజ్ఞానచిత్తుండనై కొంతకాలంబుసుఖదుఃఖము
లచేతస్రుక్కిస్రుక్కి -దిక్కెవ్వరునులేక దేవమీభక్తులశర
ణంబువేడుచు జగతిమీఁద - నున్నజీవుడఘనతామసోత్త
ముండ - నన్నుమన్నించిరక్షించునగజనాథ॥ సర్వ॥ ౨౨॥
జగములన్నియునేలు సర్వేశ్వరుండవు మునులకువరమిచ్చు
మోక్షపతివి - భక్తులరక్షింప బంగారుకొండవు దీనుల
పోషింప దేవమణివి - నరులకుసిరులిచ్చునవనిధానంబువు
వేల్పులనేలుదైవేశ్వరుడవు - యఖిలజీవులపాలిటియమృ
తవారాసివి గంధర్వులకునెల్ల కల్పతరువు - వయ్యసీమా
య తెలియంగ నలవిగాదు - సకలబ్రహ్మాదిసురులకు సం
యములకు॥ సర్వ॥ ౨౩॥ అంగనేపాళకర్ణాట భూముల
యందు సాళ్వపుళిందదేశములయందు - కాశ్మీరవంగ
విదర్భదేశములందు విధేయపౌండ్ర భూవలయమందు-
కర్ణాటలాట కొంకణరాజ్యములయందు - సరిలేనిమధ్య

దేశములయందు - పాంచాలబర్బరపాండు భూముల యందు - మాళవద్రవిడ భూమండలముల - స్వామివై మించి లోకప్రశస్థముగను - వెలసిపూజలు గైకొన్న వేల్పువయ్యా। సర్వ॥ ౭౬॥ శివ శివాయనిమిమ్ము జింపాలో నుడివిన ఘోరపాతకములు జేరవెరచు - శంకరాయని మిమ్ము సన్నుతి జేసిన భవరోగభయములు పారిపోను - పురహరాయనిమిమ్ము పూజించినంతలో భేతాళగణ ములు భీతిగొందు - భవహరాయనిమిమ్ము బ్రస్తుతిచేసిన గ్రహగతులన్నియు కడకుబోవు - మరియుపంచాక్షరీ మంత్ర పఠనచేత - ఝడిసి భూతంబులన్నియు బెదరి పోవు - సర్వగుణధామ॥ ౭౭॥ శ్రీవిరూపాక్షవసిష్ఠవిశ్వా మిత్రదూర్వాసగౌతమస్తోత్రపాత్ర - భూతనాయక శేష భూషణాన ర్వేశభీమ ప్రతాపగంభీరమూర్తి - దహన లోచన దేవదానవమందార సుందరకోటిప్రసూనబాణ- హాసభువనాకార యతులరౌద్రాకార యసహాయశూర వీరావతార - తావకనగదాసజగదేకధారణ - భారతీ

నాథ పూజిత పాదయుగళ॥ సర్వ॥ ౭౮॥ శ్రీమల్లికార్జున
స్వామినిపాదగంటి భ్రమరాంబ నిత్యవైభవముగంటి –
బంగారుగోపుర ప్రాకారములుగంటి కమనీయవృషభ
టెక్కెములుగంటి – నటియించుబంగారు స్తంభములపాద
గంటి భృంగీశ్వరాదులబిరుదుగంటి – కడునొప్పు తాళ
గంగనుపాదగంటి పంచమఠంబుల ప్రభల్లగంటి – వీర
భద్రేశ్వరుడున్నట్టి విధముగంటి శ్రీగణాక్షీశుపాదగంటి
చిత్తమలర॥ సర్వ॥ ౭౯॥ బసవరాయుని నెక్కి ప్రమథ
వర్గములతో రమణించు నీల కంఠంబుతోడ – ఫాల
నేత్రంబుతో పార్వతీదేవితో ఫణిరాజకంకణ ప్రభల
తోడ – పొందుగాభూతిత్రిపుండ్ర రేఖలతోడ మరుత్రి
శూలహస్తంబుతోడ – జహ్నుకన్యానదీచంద్ర జూటం
బుతో భద్రవారణచర్మపటముతోడ – శీఘ్రమునవచ్చి
లోక ప్రసిద్ధముగను మిమ్ము పూజించుభక్తుల మెత్తు
వయ్య॥ సర్వ॥ ౮౦॥ పరమపుణ్యులులోక పావనులత్యంత
జ్ఞానాధిపతులు మీభక్తవరులు – ప్రతివాదిమానవ పర

భద్రేభసింహాస్యులు భవరోగవాగులు మీభక్తవరులు - దూషణమనుజ సందేహవిభ్రమఖండకాను సన్నిభులు మీభక్తవరులు - అపాత్రదుర్జనజ్ఞానవాగ్జవిలాసికి నెల్ల భాను సన్నిభులు మీభక్తవరులు - ముక్తిప్రతనశ్యకరులు మీభక్తవరులు - పరమసత్కీర్తనరులు మీభక్తవరులు॥ సర్వ॥ ౫౦॥ జాహ్నవీగంగను జడలంగోలనుంచి కైర వాప్తునిపువ్వుగా ధరించి అనలుని ఫాలనేత్రంబుగ ధరియించి-భసితత్రిపుండ్రంబు సరగదీర్చి - హాలాహాలము కంఠమందున ధరియించి వాసుకుని భూషణముగా ధరించి- వామభాగమునందు పార్వతిశోభిల్ల సింహాసనం బెక్కి శ్రీకరముగ-దేవతాకోటిమిమ్ము సార్థింపగాను - రాజ్యభారంబుపాలించు రాజవయ్య॥ సర్వ॥ ౫౧॥ కమనియ్యయా పృథ్వీ కలయందుబెంపెక్కి కందర్పచంద్రుల ఘనతజెంది - ప్రతిబింబమూర్తివై భానుతేజంబున భూపాలకులచేత పూజలంది - కుటిలవాదులనెల్ల కోలాహాలముచేసి శరణాగతత్రాణ బిరుదుమెరసి - సద్గురు

స్వామివై సర్వజ్ఞమూర్తివై శైవమతంబు రంజిల్లజేసి - చతురుడై నట్టి భూలోకశంకరుడవు - పరమపుణ్యుండు శ్రీగురు బసవవిభుడు॥ సర్వ॥ ౫౩॥ కరిచర్మ ఖట్వాంగ కాయజమద భంగశంకరధవళాంగ శరణుశరణు - కపటనాటక సూత్రికమనియ్య శుభగాత్రజంభారి సుత హోత్ర శరణు శరణు - పరమపావనపుణ్య పావినీణ్య గుణగణ్య జగదేకలావణ్య శరణు శరణు - పంకజోదరు హోణ బ్రహ్మాండనిర్మాణ - సన్నుతగీర్వాణ శరణుశరణు- జహ్నుకన్యానదీజూటశరణుశరణు- శశికళామాళిధూర్జటి శరణు శరణు॥ సర్వ॥ ౫౪॥ ఏచందమున నైన నయేణాంక శేఖర నీకృపాదృష్టి మన్నించవయ్య-యేచందముననైన యేణాంక శేఖర మహిమీాద తలపు యేమరకుమయ్య - యేచందముననైన యేణాంక శేఖరు దురితవర్గము బార దోలవయ్య - నేచందముననైన యేణాంక శేఖరలీల తోనన్ను పాలించవయ్య - ముక్తిదయసేయుమే చంద మునను నీవు - నాగురుస్వామిగనినాడ నమ్మినాడ॥

సర్వ॥ ౫౫॥ స్వామిద్రాక్షా రామభీమేశ్వరానీవు కరుణా మాపాలనుగలుగవయ్య - మన్నించి బెజవాడ మల్లిఖార్జున దేవ కరుణామాపాలను గలుగవయ్య శరణార్థి కూడలి సంగమేశ్వరులింగ కరుణామాపాలను గలుగవయ్య - ధాత్రిలోవిలసిల్లు ధరణికోటమరేశ కరుణామాపాలను గలుగవయ్య - యాగమోత్తుంగ శ్రీకాళహస్తిలింగ - కంచి ఏకాంబరేశ్వర కావవయ్య॥ సర్వ॥ ౫౬॥ బాపురే బ్రహ్మయ్య బడవర బ్రహ్మయ్య కిన్నెర బ్రహ్మయ్య గోరికలచి - పశాలిగమారయ్య ముగ్ధసంగయ్యనుమాది రాజమల్లడు మదిదలంతు- చెన్నోందురేవణ సిద్ధేశ్వరయ్యను మరలుసిద్ధేశ్వరు మదిదలంతు-పరకోర రామయ్య పండిత స్వాములమరియు సద్భక్తితో మదిదలంతు - మళియరాజయ్య మహిమలు మదిదలంతు- మిమ్ము నుతియింతు శ్రీ గురుమూర్తియనుచు॥సర్వ॥౫౭॥ కాశిపురాధీశ కైలాసకంధర వేదాంతవేద్య శ్రీ విశ్వనాథ - స్థిరముగాజాహ్నవితీరమందుండిన వృషభవా

హాన కాశివిశ్వనాథ - బ్రహ్మాండనాయకా భరణనీల
గ్రీవ విధిసన్నుతా కాశివిశ్వనాథ - తాంహనాడంబరగంతి
చర్మాంబర విశ్వజ్ఞనాధారవిశ్వనాథ - వీరభద్రావ
తార శ్రీవిశ్వనాథ - వెలయుమమ్మేలవయ్య శ్రీవిశ్వ
నాథ సర్వ॥ గీ॥ భూలోకమున మిమ్ముబోలు దైవము
లేదు వీక్షింపనీవంటి వేల్పులేదు - ప్రార్థింపనీవంటి
ప్రాణబంధువులేదు యెచ్చోట మీవంటి హితుడులేదు -
సేవింపనీవంటి సృష్టికర్తయులేదు పాలింపనీవంటి ప్రభువు
లేదు - వర్ణింప నీవంటి వక పుణ్యనిధిలేదు వెదకిన మీ
వంటి విభుడులేదు - నిఖిలకారుణ్యమూర్తివి నీవెగాక
నారినీవంటి వేల్పులువిశ్వమందు॥ సర్వ॥ గీ॥ జగతిలో
గురులింగ జంగమార్చితుడను పరికింపశివపూజ పరుడ
నేను - భావింపజంగము పాదసేవకుడను వడయుడె
దిక్కునియున్నవాడ - వడయుడే మాపాలి పుడురాజధ
రుడింక వడయుడే పెన్నిధి వనరమాకు - వడయుడేమమ్మే
లువృషభేంద్ర గమనుండు - గణుతింపవడయుడే కర్త

మాకు - కారణంబైన వడయుడే కల్పతరువు - కారణం
బైనవడయుడే కామధేను॥ సర్వ॥౬౦॥ పుట్టినప్పుడేమిమ్ము
పూజింపలేనైతిదిట్టతనమునమిమ్ము దెలియనైతి - బాల
త్వమునమిమ్ము ప్రార్థింపలేనైతి యవ్వనంబున మిమ్ము
నెరుగనైతి - కొంతకాలము మిమ్ము గుర్తెరుగలేనైతి
నీమీఁదచిత్తంబు నిలుపనైతి - మూర్ఖుండనై మిమ్ము
మ్రొక్కంగలేనైతి చేరిమీసేవయు సేయనైతి - వార్ధి
కంబున మీపాదవాంఛ బొడమె - నిన్నుఁగొనియాడు
చున్నాఁడ నన్నునేలు॥ సర్వ॥౬౧॥ వేదశాస్త్రంబులు వె
యివేలువిధముల భర్గుఁడేదయివమని పల్కుచుండు -
నానామునీంద్రులు నవనాథసిద్ధులు మీముద్రధారులై
మెరసినారు - కమలాసనాదులు గరుడ గంధర్వులు
మిమ్ము బస్తుతిజేసిమెరసినారు - సర్వగీర్వాణులుసద్భక్తు
లై కొలచి వొనరమీభృత్యులై యున్నవారు-భువనకర్త
వుభర్తవు పుణ్యమూర్తి - వైన మీమహిమ తెలి
యంగ నలవియగునె॥ సర్వ॥౬౨॥ చెలగిబ్రాహ్మణహిం

సచేసినవాఁడైన కడుహీనుఁడగు మాతృగమనుఁడైన - మగువల వధియించు మానవాధముఁడైన శిశువులశిక్షిం చుచెనటిఁడైన - గోహత్య జేసినకుటిల వర్తనుఁడైన మద్యపానముసేయుమనుజుఁడైన - కైలాట కాఁడైన కన కచోరకుఁడైన ఖలుఁడైన నాచార హీనుఁడైన- కాశిలో తనువు వీడ్కొన్న గలుగు ముక్తి - సౌఖ్యకరమైన మీరున్న సరణి నుండు॥ సర్వ॥ ౬౩॥ అఖిల లోకా ధ్యక్షుఁడై యొప్పు చుండిన బసవన్న నెప్పుడు బ్రస్తు తింతు - బిరుదు వక్కాణించు జాలుని గెలచిన బస వన్న నెప్పుడు బ్రస్తుతింతు - శైవకోలాహలస్తోత్రివం తుండైన బసవన్న నెప్పుడు బ్రస్తుతింతు - పాల్కురికి సోమేశుపాలగ్గినయట్టి బసవన్న నెప్పుడు బ్రస్తుతింతు- బాహుబలుఁడైన బసవన్న బ్రస్తుతింతు - భక్తమందార బసవన్న బ్రస్తుతింతు॥ సర్వ॥ ౬౪॥ దేవతారాధ్య మీ దివ్యప్రభావంబు మహిమీఁద బొగడంగమాకుదరమె - భూరిప్రతాప మీపుణ్యచారిత్రంబు మీప్రసంగముసే

యు మాకుదరమె - మేరువకొండను మోయన్నైనాస-
మార్గంబు వర్ణింప మాకుదరమె - లౌకైక విఖ్యాతి
లోల మీ భక్తుల మహిమలు పొగడంగ మాకుదర
మె - దురితసంహారమాకును దోచినట్లు ♦ సంతతము
మిమ్ముగొనియాడ నాతరంబె॥ సర్వ॥ ౬౫॥ సూక్ష్మమా
ర్గము-నాపు దీనాగుణుండైన సద్గురుస్వామిని సన్ను
తింతు - దుర్గుణభయములు ద్రుంచి వేసిన యట్టి
సద్గురు స్వామిని సన్నుతింతు-కరుణాకటాక్షంబుగలకల్ప
వృక్షంబు సద్గురుస్వామినిసన్నుతింతు-సత్యసంకల్పుడైన
విస్తారదేశు-సద్గురుస్వామి నెప్పుడుసన్నుతింతు॥సర్వ॥౬౬
అనఘాత్ముడగు మల్లికార్జున పండితారాధ్యుల మహి
మలురచనసేయ - నలవిగా హరివిరించాదులకైనను -
దాసవవర మహా మునులకైన - యట్టి మహాత్ముండు
నట్టికొనకానాడు - బహుశిష్యగణములు బలసికొలువ -
యారూఢిగాను ద్రాక్షారామలోపల విప్రవాదముగెల
చివినుతికెక్కె - వున్నయావున్నమూర్తి నాహృదయ

మందు - నిత్యమానంబుదలచి వర్ణింతునయ్య ॥సర్వ॥ ప్రేమతో నెప్పుడుబిల్వ పత్రేశునిపాద పద్మంబులు భక్తిగొల్తు - మాపాలగల్గిన మాశివభైరవు పాదపద్మంబులు భక్తిగొల్తు - శిష్యసంఘముల పోషించిన గురుమూర్తి పాదపద్మంబులు భక్తిగొల్తు - హరపంచాక్షరీ యీ నిచ్చిన గురునిపాద పద్మంబులుభక్తిగొలుతు - రాత్రియును పగలుయునుబిల్వ పత్రవిభుని - పాదపద్మంబులకు నేనుభక్తిగొల్తు ॥సర్వ॥౬౯॥ పరమపంచాక్షరీప్రణవంబు జపియింపనెల వెరింగింపవే నీలకంఠ - ప్రాపుదాపుగ మహాపతులసామంతుల నీభక్తులను జేయు నీలకంఠ - శివ ద్రోహకులనెల్ల శీఘ్రమేయముడున్న నిలయంబునకుపంపు నీలకంఠ - మేదినీస్థలమున మిముగొల్చువారిని నిత్యంబు రక్షించు నీలకంఠ - నీవెమమ్మేలువేల్పునీలకంఠ - నీవె మాపాలి గురుడవు నీలకంఠ ॥సర్వ॥ ౭౦॥ కడుభయంకరమైన కాలకూటముచూచి చక్రాయుధుండు వీరాశరణుజొచ్చె - హాలాహలజ్వాల లంటిరాగనుజూచి చతు

